# ఆంధ్రభోజ

# శ్రీ సూర్యరాయ మహారాజ ప్రశస్తి



ప్రచురణము :

శ్రీ శ్రీ శ్రీ పిఠాపుర మహారాజ సంస్మరణసమితి.

# ఆంధ్రభోజ
# శ్రీ సూర్యారావు
# మహారాజ ప్రశస్తి


రచయితలు
శ్రీ కామఋషి సత్యనారాయణవర్మగారు
శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు



ప్రతులు 1000
మూల్యము 30 పైసలు
ప్రథమముద్రణము
14—3—1966

ప్రచురణకర్తలు
శ్రీ శ్రీ శ్రీ పిఠాపుర మహారాజ
సంస్మరణ సమితి
పిఠాపురము

ఆంధ్రభోజులు శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు
సాహిత్యచక్రవర్తులు, కళాప్రపూర్ణులు—

శ్రీ మహారాజా సాహెబ్-మెహర్బాన్-ఐ-దోస్తాన్
శ్రీ మహారాజా శ్రీ **రావు వెంకటకుమార మహీపతి**
**సూర్యారావు** బహద్దరు, మన్నెసుల్తాన్, సర్దార్, రాజమండ్రి
సర్కార్, సి. బి. ఇ. డి. లిట్.

వారి **ద్వితీయ వర్ధంతి**- సమావేశ సందర్భమున
శ్రీ శ్రీ శ్రీ పిఠాపుర మహారాజ సంస్మరణసమితి
స మ ర్పిం చి న ది.

జననము
5-10-1885.

నిర్యాణము
6-3-1964

# శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారాయ బహద్దర్ మహారాజావారి

# జీవితసంగ్రహము

రచయిత:

కామఋషి సత్యనారాయణవర్మ.

శ్రీ పద్మనాయకవంశభూషణులును, రావువంశదుగ్ధాంబుధిరాకాసుధాకరులు నగు శ్రీ వేంకట మహీపతి గంగాధర రామారావుగారికిని శ్రీ మంగాంబికాసతికిని పార్థివనామ సంవత్సర భాద్రపద బహుళ త్రయోదశి ఆదివారము ది 5-10-1885 సంవత్సరమున మహారాజ శ్రీ వేంకటకుమార మహీపతి సూర్యారావుబహద్దరువారు జన్మించిరి.

సంస్కృత అలంకారశాస్త్రగ్రంథరచయితగాను, కవిసార్వభౌమ శ్రీనాథు నాదరించినవానిగను చరిత్రప్రశస్తిగన్న శ్రీ రావు సర్వజ్ఞసింగభూపాలుడు వీరి వంశమునకు మూలపురుషులు.

వీరి శైశవదశలో నైదవసంవత్సరమున 1890 లో పితృవియోగమును 9వ యేట 1894 లో మాతృవియోగము తటస్థించినవి. వీరు మైనరులగుటవలన 'కోర్టు ఆఫ్ వార్డ్సు' వారిచే సంస్థానపరిపాలన సాగింపబడెను. ఈకాలముననే వీరి దత్తత

సోదరులవలన సంస్థానమునకై యభియోగములు తేబడి క్లిష్ట పరిస్థితుల నెదుర్కొనవలసివచ్చెను. కొంతకాలము గడిచిన పిమ్మట ప్రీవీకౌన్సిలులో 1899 నాటికి పీఠికాపురసంస్థానమునకు శ్రీ సూర్యరాట్ప్రభువులే వారసులుగా నిర్ణయింపబడి వారికి దఖలుపరుపబడినది. బాల్యదశలో చిత్రాడరాణీగారని ప్రసిద్ధివడసిన శ్రీరాజా భావయమ్మారావుగారు వీరి కనేక విధముల తోడ్పడి ఆదరించి తల్లిగారులేనికొఱతను దీర్చిరి. తొమ్మిదవయేటివరకు కోటలో సమర్థులగు నుపాధ్యాయులవలనను అనంతరము మద్రాసునందలి న్యూయింగ్టన్ రాజకుమారకళాశాలయందును వీరు విద్యాభ్యాసము చేసి ఆంధ్ర ఆంగ్లభాషలందు చక్కని పరిజ్ఞానమును సంపాదించిరి. ఆంధ్ర ఆంగ్లభాషలలో వేత్తలుగా పేరుపొందిన శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారు వీరికి అధ్యాపకులుగా నియమింపబడిరి. చిన్ననాటి అనుబంధమునుబట్టి భవిష్యత్తులో వీరు కొంతకాలము ఆంతరంగిక కార్యదర్శిగను, అనంతరము సంస్థానదివానుగను నియమితులై శ్రీమహారాజావారి యభివృద్ధి కెంతయో పాటుపడిరి. 1907వ సంవత్సరమున 21వ యేట వైభవముగా పీఠికాపురసంస్థానపట్టాభిషిక్తులై పరిపాలనాబాధ్యతలను స్వీకరించినారు. నూజవీటిప్రభువులలో సుప్రసిద్ధులైన కపిలేశ్వరపురాధీశ్వరులైన శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహద్దరువారి ప్రథమపుత్రిక యగు శ్రీచిన్నమాంబాదేవి యను ప్రసిద్ధనామముగల శ్రీరాణీ ఆండాళమ్మబహద్దరువారిని పరి

ణియమాడిరి. మహారాణీవారు సంస్కృతాంధ్ర ఆంగ్ల విద్యాకుశలురై, ఉదారాశయములతో భర్తకు అనువర్తినియై ఆశ్రితపారిజాతమై వినుతి కెక్కిరి. ఈమహారాజదంపతులకు ఇరువురు కుమారులును, నలుగురు కుమార్తెలు గలిగిరి. జ్యేష్ఠతనయులు శ్రీరాజా వేంకట మహీపతి గంగాధర రామారావుగారు యువరాజపదవి నంది ఆధునికాంధ్రకవి శేఖరులుగా ప్రశస్తి నొందిరి.

మహారాజావారు 1930 సంవత్సరమున సకుటుంబముగా ఎనిమిది నెలలపాటు పాశ్చాత్య దేశముల పర్యటనము గావించిరి. సంస్థానపరిపాలన మారంభించిన ఇరువదియైదవ సంవత్సరము 1934లో రజతోత్సవము వైభవముగా పితాపురమున జరుపబడెను. వీరు మద్రాసురాష్ట్రీయుల లెజస్లేటివుకౌన్సిలుసభ్యులుగా కొంతకాలము పనిచేసిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రోఛాన్సిలరుపదవికూడ నలంకరించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీరికి 'డి లిట్' బిరుదు నిచ్చి గౌరవించిరి. వీరి సంఘసేవ, దీనజనసముద్ధరణము, భాషాసేవ, వితరణమును ప్రశంసించుచు 1935లో ఆనాటి ఆంగ్లేయప్రభుత్వమువారిచే, 'సి. బి. యి. మహారాజ' బిరుదములతో సన్మానింపబడిరి. అనేకరంగములలో సంస్థానకీర్తిపతాకను దశదిశల చాటిన దివాన్ శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారు 1918 లో కాలధర్మము నొందిరి. అనంతరము శ్రీ కోకా సుబ్బారావునాయుడుగారు ప్రధానమంత్రులుగా నియమింప

బడిరి. 1940 లో వారి నిర్యాణానంతరము శ్రీ పిళ్లారిసెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారును, వారి పదవీవిరమణానంతరము శ్రీ కోకా శివనాధశాస్త్రిగారును దివానులై రాజకార్యముల నిర్వహించిరి. 1945 లో పలువురు ఆంధ్రప్రముఖుల ప్రోత్సాహమున పిఠాపురములో వైభవముగా మహారాజావారి షష్టిపూర్త్యుత్సవము జరుపబడినది. ఆసభలలో వీరి ఆంధ్రభాషాపోషణము, దీనజనసముద్ధరణము, దాతృత్వము వేనోళ్ళ ప్రశంసింపబడినది. అప్పటికి పిఠికాపుర సంస్థానము సాలీనా 15 లక్షలరూప్యముల రాబడితో మద్రాసు రాష్ట్రమునందలి ప్రముఖసంస్థానముగా విరాజిల్లినది. 1935వ సంవత్సరమున శ్రీమహారాణి చిన్నమాంబాదేవిగారు పూజా సమయమున హఠాత్తుగా అగ్నిప్రమాదమునకు లోనై స్వర్గము నలంకరించిరి. వీరిసంతతిలో రెండవకుమారులు శ్రీరాజా వేంకటసూర్యారావుబహద్దరువారును, నాలుగవ కుమార్తె శ్రీరాజా భావయమ్మారావుబహద్దరువారును మధ్య వయస్సునందే కీర్తిశేషులైనారు. వీరి జ్యేష్ఠతనయులు శ్రీరాజా వేంకట మహీపతి గంగాధర రామారావుగారును, ముగ్గురు కుమార్తెలును చిరంజీవులై పుత్రపౌత్రాభివృద్ధిగా నున్నారు.

మహారాజావారు ప్రథమకళత్రవియోగానంతరము కొన్నాళ్లకు మరల వివాహము చేసికొన్నారు. రెండవ

మహారాణీవారికి ఒక కుమారు డుదయించెను. కుమార రాజేంద్రులు పిఠాపురముననే విద్యాభ్యాసము చేయుచున్నారు. మహారాజావారి అవసానదశలో సుమారు ఒక దశాబ్దకాలము అనారోగ్యమువలన అజ్ఞాతముగా గడచిపోయినది. ఉత్తమసంస్థానాధిపతులఔదార్యము, వితరణము, భాషాపోషణమునకు, సాంఘికాభివృద్ధికి, దీనజనసముద్ధరణమునకు ఎంతగా నుపకరించినదో వీరిజీవితమువలన బోధపడగలదు. చివరకు 1964 మార్చి 6వ తేదీని వీరు చిరకాలగతమైన రుగ్మతవల్ల పీడితులై పిఠాపురముకోటలో దివంగతులైనారు.

శ్రీమహారాజావారు పీఠికాపురరాజ్యపరిపాలనాధికారము స్వీకరించిన 1905 మొదలు 1935 వరకు గడిచిన మూడుదశాబ్దములకాలమున మహారాజేంద్రుని ఔదార్యము కళాభిమానము, భాషాభిమానమువలన అనేక సంస్థలు వెల్లివిరిసినవి. ఆంధ్రదేశమున నవయుగనిర్మాతలుగా, విద్యావేత్తలుగా, సంఘసంస్కర్తలుగా విఖ్యాతినొందిన శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు, దివాన్‌బహద్దర్ సర్. ఆర్. వెంకటరత్నమునాయుడుగారు, జయంతి రామయ్యపంతులుగారు, దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు సర్వకార్యములందును వారికి తోడ్పడుచున్న సచివశేఖరులగు శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారు మున్నగు ప్రముఖులు, తక్కిన కవిపండితప్రకాండు లెందరో

మహారాజువారి వితరణమునకు తావి కల్పించి వీరి ఆశయసిద్ధికి కృషి సల్పినారు. వీరి వితరణమువలన- సాహిత్యకళాపోషణ మున ఆంధ్రదేశమున నొక నవశకోదయమైనట్లుగా భావించ వలసియున్నది. వీరి వితరణము పలుశాఖలుగా విస్తరిల్లి అనేక ప్రజోపయోగకార్యములకు తోడ్పడినది. స్థూలముగా వీరి ప్రోత్సాహమునకు పాత్రమైన శాఖలలో 1. సంస్కృతాంధ్రభాషాసముద్ధరణము- విద్యాపోషణము, 2. హరిజనోద్ధరణము, 3. వైదిక-బ్రాహ్మమతోద్ధరణము, 4. ఆంధ్ర సాహిత్యపరిషత్ స్థాపనము, 5. కళాపోషణము, 6. సంఘసంస్కరణోద్యమము, 7. దీనజనసముద్ధరణము, 8. ఆరోగ్య వైద్యసదుపాయములు కల్పించుట. 9. స్త్రీ జనోద్ధరణము ముఖ్యమైనవిగా నెన్నవచ్చును. ఇవిగాక ఆంధ్రదేశమున అభ్యుదయదాయకములైన సంస్థలలో వీరి ఔదార్యమును వితరణమును స్వీకరింపని సంస్థలు లేవనుట అతిశయోక్తి గాదు. వీరు మహోదారులై ఆయాసంస్థలకు గావించిన విరాళములను సూచనమాత్రముగా కొన్నింటి నిట ఉదాహరించుచున్నాను.

1. మూడులక్షలు వెచ్చించి కాకినాడలో అనాథశరణాలయమును స్థాపించినారు. అందు చాలమంది విద్యాధికులై బి. ఏ. పట్టముల వంది ఉన్నతోద్యోగులై కుటుంబములతో సుఖజీవనము గడపుచున్నారు.

2. కాకినాడ పి. ఆర్. కాలేజీకి ఎదురుగా సుందరమైన బ్రహ్మోపాసనా మందిరమునకు లక్షరూప్యములు వ్యయపరచినారు.
3. పీఠికాపురాధీశ్వరకళాశాలను మొదటితరగతికళాశాలగా మార్చుటకు రెండులక్షలు, కళాశాలనిర్వహణకు రెండులక్షలు, నలుబదిఎకరములు విశాలస్థలమునందు ఆట్సుకళాశాలభవనములకు ఎనిమిదిలక్షలు వెచ్చించినారు. స్త్రీలకు ఉచితవిద్యాసౌకర్యములు కలిగించినారు. ఇచ్చట హరిజనులకు ఉచిత విద్యాసౌకర్యము లుండెడివి.
4. కాకినాడలోని అన్నదానసమాజభవనముల నిర్మాణమునకు 53 వేలు వెచ్చించినారు.
5. కాస్మాపోలిటన్ క్లబ్బు వీరి ఔదార్యమువలననే స్థాపన జరిగినది.
6. పీఠికాపురమునందలి అగ్రహారమునగల క్రైస్తవ మిషనుహాస్పిటలునందు స్త్రీలకు- శిశువులకు చికిత్సలకు ప్రత్యేకముగా భవనములను కట్టించుటకు లక్ష రూపాయలు వ్యయపరచినారు.
7. క్షయ, మధుమేహము మొదలగు రోగనివారణలో పరిశోధనకు భూరివిరాళముల నొసంగినారు.
8. ఆంధ్రుల బాలబాలికల విద్యావ్యాప్తికి పాఠశాలలు, వారికి వసతిగృహములకు, వస్త్రములకు లక్షలు వెచ్చింపబడినవి.

9. యాభై వేలరూపాయల ఖర్చుతో పిఠాపురమున స్త్రీలకు పురుషులకు వేర్వేరుగా పురమందిరములను నిర్మించి క్లబ్బులను స్థాపించి నిర్వహించిరి. మహారాణీవారు ప్రత్యేకముగా నొక ఘోషాస్కూలును నడిపినారు.

10. పిఠాపురములోగల శ్రీరాజా రావు భానయమ్మారావు హైస్కూలు నిర్వహణము సర్వము తామే వహించినారు. ఈపాఠశాలలో కవులు, విద్యావేత్తలు నగు శ్రీయుత కూచి నరసింహముపంతులు ప్రధానాచార్యులుగా పనిచేసి ఆసంస్థను ఆదర్శ ఉన్నతపాఠశాలగా నొనర్చిరి.

11. సంఘసంస్కరణోద్యమముల నెన్నింటికో భూరివిరాళముల నొసంగిరి.

12. తర్క, వ్యాకరణ, వేద, వేదాంత, మీమాంసాది వైదికవిద్యలలో పండితులను నియమించి దసరా రోజులలో ఆయాశాస్త్రములందు పరీక్షలు జరిపించి వారిలో నుత్తీర్ణులైన పండితులకు వార్షికబహుమానములకై సాలీనా పదివేలు వ్యయపరచినారు.

13. పేదలగు వెలమవిద్యార్థులసౌకర్యమునకై వసతిగృహమును నిర్వహించినారు.

14. రాజమహేంద్రవరమునందలి హితకారిణీసమాజము, వీరేశలింగఆస్తికోన్నతపాఠశాలకు, వితంతుశరణాలయ

మునకు భూరివిరాళముల నొసంగిరి.

15. బొంబాయి- వంగదేశము- ఆంధ్రదేశమునందలి సంఘసంస్కరణోద్యమములకు, గోఖలే ప్రారంభించిన దక్షిణాఫ్రికానిధులకు, గాంధీమహాత్ముని అస్పృశ్యతానివారణనిధులకు, కస్తూరీబాయి స్మారకనిధికి, భారతదేశమందలి నైతికసహాయనిధులకు యుద్ధనిధులకు భూరి విరాళముల నొసంగినారు.

16. ఆంధ్రబ్రాహ్మసమాజమునకు ఒక లక్షరూపాయలు విరాళముగా నిచ్చిరట.

17. కవులకు, గ్రంథప్రచురణములకు వేలకొలది ధనము విరాళములుగా నిచ్చి సత్కరించిరి.

18. విదేశములలో ఐ. సి. యస్. మొదలగు ఉన్నత విద్యల నభ్యసించుటకై పలువురు విద్యార్థులకు ధన సహాయము చేసిరి. వీరందరు జిల్లాఅధికారులుగా, ఉన్నతోద్యోగులుగా నియమింపబడినారు.

19. ఆంధ్రదేశమునందలి ఆర్టుస్కూళ్ళకు- ఆర్టుగ్యాలరీలకు చిత్రకళాసంఘములకు- విరాళముల నిచ్చి ప్రోత్సహించిరి. బొంబాయి ఆర్టుకళాశాలలో కళాభ్యాసనమునకై శ్రీ చామకూర భాష్యకార్లుగారికి ధనసహాయము గావించిరి.

20. నాటకరంగోద్ధరణమునకు, పేదవిద్యార్థుల సహాయమునకు ఉపకారవేతనములకు సాలీనా 25 వేలువరకు

వ్యయ మొనర్చెడివారు.

ఇదిగాక ఆంధ్రసాహిత్యపరిషత్తు నిర్మాణమునకు, శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునకు, అముద్రిత ప్రబంధముద్రణమునకు- లెక్కకుమిక్కుటముగా లక్షలధనమును విరాళముగా నొసంగిరి.

మహారాజావారి వితరణముల నెన్ని చెప్పినను ఇంకను చెప్పుకొనవలసినవి మిగిలియేయుండును.

మహారాజావారి వితరణమునందలి ప్రతిపైసయొక్క విలువ- వినియోగము సంపూర్ణముగా గ్రహించియే ఈద్రవ్యమును వినియోగించినట్లు వారే వారిమిత్రులతో ననిరట.

## సంగీతకళాపోషణము :

మహారాజావారి కళాభిమానము సాహిత్యాభిమానమునకు తీసిపోనిది. కర్ణాటకసంగీతముపై వారికిగల గాఢానురాగమే సంగీతకళానిధులునూ, వైణికవిద్వాంసులు నగు నందిగాన వెంకయ్యగారు, తుమురాడ సంగమేశ్వరశాస్త్రి గార్లను ఆస్థానవిద్వాంసులుగా నియమింపజేసినది. సంగమేశ్వరశాస్త్రిగారి వీణావాద్యకౌశలము విశ్వకవి రవీంద్రుని మన్ననలకు ప్రశంసలకు పాత్రమైనది. మహారాజావారి మిత్రులు దివాన్‌బహదూర్ శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు కాకినాడలో స్థాపించిన సరస్వతీ గానసభలకు శ్రీ మహారాజావారు ప్రధానరాజపోషకులుగా

నుండిరి. కాకినాడ దసరాగానసభలకు వచ్చిన దాక్షిణాత్య, ఔత్తరాహిక సంగీతవిద్వాంసు లందరు పీఠికాపురమున కాహ్వానింపబడి సంగీతసభలు జరిపి తగినపారితోషికముల నంది గౌరవింపబడుచుండెడివారు.

నాటకకళాపోషణము :

మహారాజావారి ఆస్థానకవీశ్వరులైన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు రచియించిన నాటకము లన్నియు మహారాజమందిరమునందలి నాటకశాలలో ప్రదర్శింపబడుచుండెడివి. ఆనాటి ఔత్సాహికనటులకు శ్రీపంతులుగారే స్వయముగా అభినయశిక్షణము గరపి వారిని ఉత్తమనటులుగా తీర్చిదిద్దెడివారు. ఆంధ్రదేశమునందలి అనేకనాటక సంఘములకు కోటలో ప్రదర్శనమునకు ఏర్పాటు గావించి ఉచితరీతిని వారిని సన్మానించెడివారు. మహారాణీవారి నాటకకళాభిమానపురస్సరముగా నాటకాంతమున నటులకు ఫలములు, భక్ష్యముల నంపి ఆనందపరచెడివారు. మద్రాసులో మహర్షి బులుసు సాంబమూర్తిగారు, శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ గారు గావించిన నాటకరంగోద్ధరణకార్యకలాపములకు శ్రీమహారాజావారి సహాయ ముండెడిదని ప్రతీతి.

చిత్ర శిల్ప కళాపోషణము :

వీరి పితృపితామహుల కాలమునుండి సంస్థానమునందలి దేవాలయములలో వాహనములను తయారుచేయుటకు

దేవతామూర్తులకు రంగులువేయుటకు- రథాలంకరణములకు కొందరు ఆనువంశిక చిత్రకారకుటుంబములను ఈనాము లిచ్చి పోషించినారు. ఆ చిత్రకారులు రాజాస్థానమున కొలువుదీర్చిన రాజదర్బారునందలి ప్రభువుల రూపచిత్రములను తస్వీరులు చిత్రించి వారికి సమర్పించెడివారు. ఈ శిల్పులచే తయారు చేయబడిన వాహనములు నేటికి కుక్కుటేశ్వర కుంతీమాధవుల ఆలయములలో గలవు. వానిలో కుక్కుటేశ్వరుని ఆలయములోగల సప్తనారీహంసవాహన మొక అపూర్వకళాఖండముగా నెన్నదగియున్నది. మహారాజావారు బ్రహ్మమతాదరము గలవారైనను పూర్వసంప్రదాయములపై గల యనురాగముతో ఆనాటి ఆచారముల కెట్టిభంగము కలుగకుండ కాపాడిరి. దేవాలయములందలి కళ్యాణోత్సవములకు దేవదాసీలను నాట్యకత్తెలుగా ఈనాము లిచ్చి పోషించి దేవుని రథయాత్రలలో దైవసన్నిధిలో భామకలాప, గొల్లకలాప ప్రదర్శనముల నేర్పాటు చేసి యాత్రికుల నానందపరచెడివారు. అట్టి భామకలాపవిద్యాకోవిదులలో పెండ్యాల సత్యభామ యను విదుషీమణి ఈ సంస్థానమున పోషింపబడినది.

నవ్యాంధ్రచిత్రకారులలో ప్రముఖులైన స్వర్గీయ దామెర్ల రామారావుగారిచే 1923 లో స్థాపింపబడిన ఆంధ్ర చిత్రకారుల సంఘమునకు మహారాజావారు ప్రధానపోషకులై తమ కళాభిమానమును వ్యక్తపరచిరి. కాకినాడ, రాజమహేంద్రవరములలో శ్రీరాజావారి బంగళాలలో జరిగిన

కళాప్రదర్శనములకు అవనీంద్రనాథటాగూర్, నందలాల్ చిత్ర బోసు, జె. పి. గంగూలీ, డి. పి రాయచౌదరి మొదలగు ప్రసిద్ధ కళాకారుల చిత్రములను తెప్పించి ప్రదర్శింపజేసి వాటి లోగల విశిష్టచిత్రఫలకములను శ్రీమహారాజావారు కొని రాజభవనములో నుంచిరి.

క్రీడావినోదములు :

మల్లవిద్యావిశారదులైన వస్తాదులను పంజాబునుండి రప్పించి పోషించి వారిచే కుస్తీప్రదర్శనముల నేర్పాటుచేసెడివారు. ఆనాటి విద్యార్థులకు మల్లవిద్యాభ్యాస మొకప్రత్యేకాకర్షణముగా నుండెడిది. కోడి రామమూర్తిగారు పిఠాపురములో వారి బలప్రదర్శనము గావించి మహారాజావారి మన్ననల నందిరి. ఇవిగాక నవీనములగు బేడ్మింటన్, టెన్నీసు మొదలగు కందుకక్రీడలలో ప్రఖ్యాతులైన ఆటగాండ్రను రావించి కోటలో ప్రదర్శనముల నిప్పించెడివారు. ఉద్యానవనములను పెంచుటలో వీరికిగల ఆసక్తి మిక్కిలి ప్రశంసనీయమైనది. గులాబీలన్న వీరికి అత్యంతప్రీతి. మద్రాసులోని వీరిభవనమునకు 'గులాబీ' యను పేరిడిరి. అనేక పుష్పప్రదర్శనములలో వీరి గులాబీలు బహుమతుల నందుకొన్నవి. మేలుజాతి శునకములను, కుక్కుటములను పెంచుట వీరి కొక అభిమానవిషయము.

వాటి ఆరోగ్యరక్షణమునకు ప్రత్యేకముగా నొక ఆంగ్ల వైద్యుని నియమించినారు. ప్రభువుల విలాసవినోదములు

గూడ అనేక కళాకారులపోషణమునకు తావు కల్పించుచుం డును. బహుముఖమైన మహారాజావారి కళాసాహిత్యపోష ణము చరిత్రలో నొక విశిష్టస్థానము గడించుకొన్నది. అర్ధ శతాబ్దకాలము (1900-1950) వరకు ఆంధ్రదేశచరిత్రలో మహారాజావారి ఉదయము ఒక నూతనశకోదయముగా భాసి ల్లినది. అనేక ప్రాచీన అర్వాచీనసంప్రదాయములకు సంగమ స్థానమై ఆయన జీవితము ఒక ప్రయాగవలె చిరస్మరణీయ మైపోయినది. జమీందారీలను ప్రభుత్వము స్వాధీనపరచు కొన్నపిదప ఆనాటి జమీందారులు సాహిత్యకళాపోషణకై వెచ్చించిన ద్రవ్యములో కొంతభాగమైనను వినియోగించి నాటిప్రభువులు స్థాపించిన సంస్థలను పునరుద్ధరించుట ప్రభుత్వ ముఖ్యకర్తవ్యముగా భావించిన ఆయాప్రభువుల ఆశయసిద్ధికి తోడ్పడినవారగుదురు.

ఆంగ్లేయుల పరిపాలనాకాలమైన రెండుశతాబ్దములలో ఆంధ్రజమీందారులు గావించిన సాహిత్యకళాపోషణ గురించి ప్రత్యేక చారిత్రకగ్రంథములు విజ్ఞులచే వ్రాయించి భద్రపర చవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. అట్టిచరిత్రలు ఆనాటి మహారాజపోషణమునకు పవిత్రస్మృతిచిహ్నములుగా వెల యగలవు. మహారాజకుటుంబమును పరమేశ్వరుడు సర్వదా కాపాడునుగాక !

---

మహారాజావారి షష్టిపూర్తి ఉత్సవసంచికలోని ప్రముఖుల రచనల ననుసరించి యీ వ్యాసము వ్రాయబడినది. వారికి రచయిత కృతజ్ఞుడు.

# శ్రీ సూర్యారాయ ప్రభువర్యుల విద్యాపోషణము

రచయిత :

**చిలుకూరి పాపయ్యశాస్త్రి**

శ్రీ పీఠికాపురాధీశకళాశాలోపన్యాసకుఁడు

శ్లో. ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషామసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి.

వెనుకటికాలమునాఁటి ప్రజాపాలకులకీర్తి, వాఙ్మయమను అద్దములో ప్రతిఫలించినచో, ఆ పాలకులు గతించిపోయినను, వారు పోషించిన వాఙ్మయము నిలిచినంతకాలము వారికీర్తి నశింపకుండ నిలిచియుండునని విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయములో తెలిపియున్నాఁడు. శ్రీసూర్యారాయ ప్రభువర్యులసమయములో జరిగిన విద్యాపోషణము వారికీర్తిని శాశ్వతము చేయుటయేగాక, ఆనాఁ డాంధ్రదేశములో విద్యాస్థానము లన్నియు నభివృద్ధి పొంది ఆంధ్రదేశమునకు సుస్థిరమైన మేలు చేకూర్చినవిధమును పరికింతము.

## పిఠాపురప్రశస్తి

పీఠికాపురము పురాణప్రసిద్ధమయిన పుణ్యక్షేత్రము. అక్కడ కుంతీమాధవకుక్కుటేశ్వరులు పీఠాంబికాహుంకారిణీ

దుర్గలు, తదితరదేవతామూర్తు లన్నియు వెలసియుండుటచే అది పరమపుణ్యక్షేత్ర మైనది. తన్మూలముననే భారతీయ వైదికధర్మపాలకులైన ప్రభువులకు, ధర్మాచరణతత్పరులైన ప్రజలకు ఆ పురము నివాసస్థాన మైనది. ఆ దుర్గము నాక్ర మించుకొనిన రాజవంశము లెన్నియో ఆంధ్రదేశమును పరి పాలించుచువచ్చినట్లు, క్రీ. శ. 4వ శతాబ్దినాటి సముద్ర గుప్తునిశాసనము మొదలుగా నెన్నియో దానశాసనములు తెలుపుచున్నవి. పిఠాపురపరిసరగ్రామము లన్నియు అచటి దేవతలకో, ఆ దేవతల కర్పించిన గోవులగ్రాసమునకో, వేదవేదాంగవేత్తలయిన భూసురులకో దానములు చేసినట్లు వెనుకటి దానశాసనములు తెలుపుచున్నవి. ఈవిధముగా యోజించిన పిఠాపురపరిసరమంతయు పుణ్యతీర్థక్షేత్రముల తోను విద్యానిధులతోను నిండియున్నదని వెనుకటిచరిత్రము తెలుపుచున్నది.

## పిఠాపురమునం దన్నిసంప్రదాయములు గలవు

పాదగయాక్షేత్రమై కుక్కుటేశ్వరహుంకారిణీదుర్గల తత్పరివారదేవతల సాన్నిధ్యముచే నది పురాణప్రసిద్ధమైన శివక్షేత్రము. కుంతీమాధవపీఠాంబికాసన్నిధానము,ఆళ్వారుల ప్రతిష్ఠ మున్నగువానిచే వైష్ణవదివ్యక్షేత్ర మది. ఊరున కుత్త రముగ అగ్రహారపుదిబ్బ లని యీనాడు వ్యవహారమున్న మట్టిదిబ్బలు పురాతనమైన కోటగోడలు. ఆ దిబ్బకు

తూర్పుగ అరమైలుదూరములో 'బోగముదానిదిబ్బ' అను పేరుతో మల్యాలవారితోఁటలో నుండిన యిటుకలపాతరగల మట్టి, బౌద్ధస్తూపము. ఇప్పటికోట నంటియున్న గుజరాతిపేట లో నుండిన సన్యాసిరాళ్లు అనునవి జైనవిగ్రహములు. భారతీయులకు పుణ్యక్షేత్రములై యుండి, తమసాధనల కుప యుక్తమైన చోటులకే జైనులు బౌద్ధులు చేరియుండిరను టకు పిఠాపురమునందున్న యీ వివిధమతచిహ్నములే నిదర్శ నములు. ఈవిధముగ పిఠాపురము వివిధవిద్యలకు సకలకళలకు నిలయమై రెండు వేలయేండ్లనుండి, పారమార్థికజీవితము గడుపువారందఱికి ఆశ్రయ మిచ్చినదని నిరాఘాటముగఁ దెలుపవచ్చును.

## క్షేత్రమహత్త్వ మెప్పటికి తరుగఁబోదు

మార్కండేయమహేశ్వరునకు గోపాలస్వామికి నివాస స్థానమై రుద్రపాదక్షేత్రమైన రాజమహేంద్రవరము సకల విద్యల కాలవాలమై, విద్వత్కవులకు విద్యావ్యాప్తికానాఁడు ఈనాఁడుకూడ నాటపట్టుగా నుండినది. ఆవిధముగనే పాదగ యాక్షేత్రమై కుంతీమాధవకుక్కుటేశ్వరసాన్నిధ్యముచే భోగ మోక్షప్రదమైన పిఠాపురముకూడ శ్రీసూర్యరాయప్రభు వర్యుల పాలనము సాగుచుండినంతవఱకు సకలవిద్యలకు వివిధ కళలకు స్థానమైయున్నది. పీఠికాపురము రాజధానిగా సుప్రసి ద్ధమయిన రాజవంశములు పాలనము సాగించిన వెనుక తరువాతి

శతాబ్దములలో, సర్వజ్ఞసింగభూపాలునివంటి మహావిద్వాంసుఁడు విద్వత్కవిపోషకుఁడు అవతరించి విశేషవిఖ్యాతి నార్జించిన రావువంశమున జన్మించిన ప్రభువర్యులు, ఈ సంస్థానాధిపతులుగా వచ్చిననాఁటినుండియు, అచట విద్యాస్థానము లభివృద్ధినొందుచు కవులకు పండితులకు ఆశ్రయము లభించుచునేవచ్చినవి.

శ్రీ రావు నీలాద్రిమాధవరాయణింగారి పాలనసమయమున కుక్కుటేశ్వరభక్తుఁడై కవిసార్వభౌముఁడైన కూచిమంచి తిమ్మకవి మహాకవిగా రూపొందినాఁడు. వారిపరిపాలనసమయమున పిఠాపురమునందు పరిసరప్రదేశములందు దేవతానిలయము లెన్నిటికో సముద్ధరణము జరిగి, వివిధశాస్త్రవిద్వాంసులు దేవతాస్థానములలోఁ బోషింపఁబడినారు. తరువాత శ్రీ రావు గంగాధరరామారాయణింగారి పరిపాలనకాలమునాఁడు, ఆంధ్రప్రదేశమందలి వేదార్థవేత్తలుగా సుప్రసిద్ధులయిన బ్రహ్మశ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారికాశ్రయ మిచ్చి ముప్పదిపుట్ల భూమి సన్మానము చేయఁబడినది. శ్రీ దేవులపల్లి సోదరకవులు, జంటకవులుగా వారియాస్థానకవులై ప్రసిద్ధి కెక్కినారు. ఈవిధముగ ప్రాచీనకాలమునుండియు పిఠాపురమున జరుగుచుండిన విద్యాపోషణము, ఆంధ్రభోజబిరుదాంచితులయిన శ్రీ రావు సూర్యారాయప్రభువర్యులపాలనమునాఁడు సహస్రముఖమై వెల్లివిరిసి యావదాంధ్రదేశమునకు మహోపకారము జరిగినది.

## పిఠాపురమునందలి విద్యాస్థానములు

శ్రీరావు గంగాధరరామారాయణింగారి పాలనము నాఁడు వేదపండితులకు శాస్త్రపండితులకు ఆస్థానకవులకు ఆదరసన్మానములు జరుగుచుండెడివి. వారితరువాత శ్రీసూర్యారాయప్రభువర్యులు పిఠాపురసంస్థానపాలకులుగా వచ్చినపుడు, వారికి న్యాయింగడన్ కాలేజీలో విద్యాబోధకులుగా నుండిన శ్రీ మొక్కపాటి సుబ్బారాయుఁడుగారు దివాన్‌గా నియుక్తు లయినారు. వారు మహామేధాసంపన్నులు. మంత్రి బృహస్పతులు. పిఠాపురసంస్థానమహావృక్షము కీర్తిలతలతోఁ బెనఁగొని, ఆంధ్రదేశకల్యాణకారక మగునట్లు మొక్కపాటిన వారు మొక్కపాటివారే. శ్రీ సూర్యారాయప్రభువర్యులు ఆంధ్రభోజులుగా వినుతికెక్కుటకు మూలమయినది వారి విద్యాపోషణము. వారి కామార్గమున ప్రవేశము కులక్రమాగత మయినను విశిష్టస్థానము నందుటకు మార్గదర్శకులు మంత్రిబృహస్పతులే.

## వేదశాస్త్రపరిషత్సభలు

పిఠాపురసంస్థానములో ఏటేట దసరాపండుగులకు వేదశాస్త్రపండితుల నాహ్వానించి, వారిచే వేదార్థములు చెప్పించుట వివిధశాస్త్రములందు వాక్యార్థములు చేయించుటయు జరిగి వారిని సముచితముగ సన్మానించుట జరుగుచుండెడిది. తరువాత క్రమముగ వివిధశాస్త్రములందు పరీక్షలు జరిగించి

వానిలో నుత్తీర్ణులయినవారికి ఏటేట 30 రూప్యములు వార్షికముగ నిచ్చుట జరుగుచుండెడిది. క్రమముగ రెండేసి శాస్త్రపరీక్షలం దుత్తీర్ణులయినవారికి 60 రూప్యములు, వేదాంతముతోసహా మూఁడుశాస్త్రములం దుత్తీర్ణతనందినవారికి 90 రూప్యములు బహుమానముగ నిచ్చుచుండెడివారు. ఈ సమయమున తమ తమ శాస్త్రపాండిత్యములో అద్వితీయులై ఆంధ్రదేశప్రఖ్యాతులయిన పండితులు పీఠికాపురాస్థానవిద్వాంసులుగా నుండి వారే పరీక్షాధికారులుగ నుండెడివారు. వ్యాకరణమునకు మా పిన్నతాతగారు శ్రీ చిలుకూరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, తర్కమునకు శ్రీ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారు, అద్వైతవేదాంతమునకు శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రిగారు, విశిష్టాద్వైతమునకు శ్రీమాన్ గుదిమెళ్ల వేంకటరంగాచార్యులుగారు, వేదార్థమునకు శ్రీ వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఆనాఁడు పీఠికాపురాస్థానవిద్యాధికారులుగా నుండెడివారు. తరువాత కొంతకాలమునకు శ్రీ వేమల సూర్యనారాయణశాస్త్రిగారు వ్యాకరణవిద్యాధికారులుగ నియుక్తు లయినారు. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రులవారివంటి మహావిద్వాంసు లందఱకు ఆయాస్థానములో సన్మానము లేటేట జరుగుచుండెడివి. ఆనాఁటి పీఠాపురాస్థానవిద్వాంసులకు సాటియయినవారు వారే యనుట నిర్వివాదమయిన సత్యము.

పిఠాపురాస్థానములో శాస్త్రపరీక్షలయం దుత్తీర్ణులైన వారికి ఆసంస్థానమువారి పారితోషిక మేకాట లభించుటయే గాక, అట్టివారు శాస్త్రపండితులుగా లెక్కింపఁబడి దేశమం దంతటను ఆదరసత్కారములు లభించుచుండెడివి. ఈవిధముగ 1910 మొదలు 1935 వఱకు 25 సంవత్సరములలో ఆంధ్రదేశమందంతటను వివిధశాస్త్రము లభ్యసించిన విద్వాంసులు బయలుదేరుటకు పీఠికాపురమహారాజుల విద్యాపోషణమే మూలము. ఆనాఁడు పిఠాపురాస్థానవిద్యాధికారుల సన్నిధిని వేదాంతాదివిద్యాభ్యాసము చేయవచ్చిన విద్వాంసులు సకుటుంబముగ నుండి విద్య నభ్యసించుట కవకాశము కల్పించినది శ్రీసూర్యరాయప్రభువర్యుల యౌదార్యమే. ఈవిధముగ వేదవేదాంగాదివిద్యాపోషణమునకు పిఠాపురసంస్థానము పూనుకొనినకారణముననే, ఆంధ్రదేశమునందు ప్రఖ్యాతులయిన శాస్త్రపండితులు బయలుదేరి యిప్పటితరమువారికి వివిధశాస్త్రబోధకులుగా నుండుట సంభవించినది. ఈనాఁటి కాంధ్రదేశములో వివిధశాస్త్రముల నభ్యసించిన విద్వాంసు లేకొందఱయిన నిలిచియున్నారనిన, దాని కానాఁటి సూర్యరాయప్రభువర్యుల విద్యాపోషణమే మూలమయినది.

ఇంతేకాదు. ఆనాఁడు శాస్త్రపరీక్షలం దుత్తీర్ణులైన వారు పిఠాపురసంస్థానమున వార్షికములు తీసికొనుటకు వచ్చినపుడు, తమ తమ శాస్త్రములలో నూతనాంశములపై పూర్వ

పక్షసిద్ధాంతములను వ్యాసములుగ లిఖించి తీసికొనిరావలయు నని నియమ ముండెడిది. ఇట్టివ్యాసముల నన్నిటిని, భద్ర పఱచి, వానిని నాగరిలిపిలో ముద్రించి, ఆంధ్రపండితులు తమప్రతిభనుబట్టి చేసిన శాస్త్రపరిశోధనలను యావద్భారత దేశమున కందీయవలయుననుట దానికి లక్ష్యము. ఈలక్ష్యము సాధితమైనపుడు పిఠాపురసంస్థానము భారతీయసంస్థానము లన్నిటికి నాదర్శప్రాయమై యుండవలయునని వారి యాకాంక్ష. ఇట్టికార్యక్రమము సాగుచుండిన ఆనాఁడు పిఠాపురాస్థాన విద్వాంసులయొద్ద శాస్త్రవిద్య లభ్యసించి, మహావిద్వాంసులుగ రూపొందినవారు తర్క వ్యాకరణ వేదాంతములను నాంధ్రదేశమంతటను వ్యాపింపఁజేసినవా రెందఱో యున్నారు. 60 యేండ్లకు పైఁబడి నిలిచియున్న ఆ పండితు లందఱు శ్రీసూర్యరాయప్రభువరేణ్యుల యౌదార్యము నెల్లపుడు స్మరించుచునేయుందురు. ఈవిధముగ పీఠికాపురాధీశ్వరులు నెలకొల్పిన విద్వత్సభలు వేదశాస్త్రాభివృద్ధి కమూల్యమయిన సహాయము నొసఁగినవని కొందఱకే తెలియును.

## కవితాపోషణము

శ్రీసూర్యరాయప్రభువర్యుల పాలనప్రారంభములో శ్రీ దేవులపల్లి సోదరకవులు పీఠికాపురాస్థానకవులుగా నుండెడివారు. వారు మహేంద్రవిజయము, నయనోల్లాసము, యతిరాజవిజయము మున్నగు ప్రబంధములు రచించి ప్రఖ్యాతి

గాంచినవారు. వారి తరువాత శ్రీ వేంకటరామకృష్ణకవులు పిఠాపురాస్థానవిద్వత్కవు లయినారు. వీరు వివిధావధానము లుచేసి, యెన్నియో గ్రంథములు రచించి వినుతికెక్కినవారు. వీరికి తిరుపతివేంకటకవులతో కవితావిషయకమైన వాగ్వాద ములు పత్రికాముఖమున కొన్నిసంవత్సరములు కొనసాగి నవి. ఆనాఁటియువకుల నెందఱినో కవిత్వమునుగూర్చి తెలిసి కొనుటకు, పద్యకవిత్వమును జెప్పుటకు, రచయితలనుగా తయారుచేయుటకు ఈ జంటకవుల యిరువురసంగ్రామములు ముఖ్యసాధనము లయినవి. వీరియిరువురవాగ్యుద్ధములను పై నుండి పరికించినవా రెందఱో వారితరువాతితరములో మహా కవులుగా రూపొందినారు. 'స్పర్థయా వర్ధతే విద్యా' అను సూక్తి చొప్పున, ఆనాఁటి కవులజంటల కేర్పడిన స్పర్థ పద్య రచనకు శబ్దముల సాధుత్వాసాధుత్వనిర్ణయమునకు తరువాతి వారికి మార్గదర్శక మయినది.

ఈవిధముగ ఆంధ్రకవితారంగ మాంధ్రదేశమున నూతనమార్గములో వృద్ధిపొందుటకు, గ్రాంథికాంధ్రములో రచన సాగుటకు, పీఠికాపురసంస్థానములో వేంకటరామకృష్ణ కవు లాస్థానకవులుగా నాదరింపఁబడుట మూలమయినది. తిరుపతివేంకటకవులకు వేంకటరామకృష్ణకవులకు నేర్పడిన వాగ్వివాదములలో ఖండనమండనముల కిరుపక్షములందు ముఖ్యముగఁ బూనిక వహించినవారు శ్రీ దివాకర్ల తిరుపతి

శాస్త్రిగారును, శ్రీ ద్వివేది రామకృష్ణకవిగారును. శ్రీ రామకృష్ణకవిగారు 'కోకిలకాకము' అను నిరువదియొక్క-పద్యములు వ్రాయుట వారి వాగ్వివాదమునకు మూలము. ఈ పద్యములకు బదులు వ్రాయుటకుఁగా గీరతము కొన్ని పర్వములు బయలుదేరినవి. పాశుపత మొకవైపునుండి బయలుదేరఁగా పరాస్తపాశుపత మింకొకవైపునుండి బయలుదేరినది. 'పాణిగృహీత' నొకరు చేపట్టఁగా 'పాణిగృహీతి' నింకొకరు పరిగ్రహించినారు. ఇట్టివి పరశ్శతము లానాఁడు బయలుదేరి పాఠకుల కెందఱకో యుత్తేజనము కలిగించినవి. శ్రీసూర్యరాయప్రభువర్యులప్రాపు వేంకటరామకృష్ణకవుల కేర్పడియుండుట చేతనే ఆనాఁటి వాగ్యుద్ధములమూలమున సంస్కృతాంధ్రకవితామార్గములు పరిక్షుణ్ణము లయినవి.

## పానుగంటివారి పాత్ర

హాస్యరసపూరితమయిన రచనలో అద్వితీయులయిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు శ్రీసూర్యరాయప్రభువర్యుల యాదరముతో, వారిసమక్షమున వినోదగోష్ఠి సాగించుచు, సాక్షి ఉపన్యాససంపుటములను, అనేకమయిన నాటకములను విలక్షణమయిన గ్రాంథికశైలిలో రచించి, శ్రీసూర్యరాయప్రభువర్యులు చేపట్టిన గ్రాంథికభాషావాదమునకు, గ్రాంథికభాషాభివృద్ధికి సాటిలేనిసేవ చేసియున్నారు. సాంఘికమైన దురాచారములను సంకోచ మేపాటియు లేకుండ

హాస్యరసపూరితమైన రచనలో వివరించుచు, లోకమునకు సన్మార్గమును నిరూపించుటలో పానుగంటివారిపాత్ర అద్వితీయమైనది.

ఈవిధముగనే ప్రఖ్యాతరచయితలై ఆంధ్రదేశమందంతటను విఖ్యాతులైన విద్యానిధులు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము, శ్రీ కూచి నరసింహముగారును శ్రీరాజావారి కాశ్రితులై తమరచనలచే దేశమునకంతకును ఆశ్రయింపవలసినవారయినారు. వారిరచనలు భాషయుండినంతకాలము నుండఁదగినవి. శ్రీసూర్యారాయప్రభువర్యుల సమాదరమువనే ఈ సింహత్రయము ప్రఖ్యాతరచయితలుగా కవులుగా వన్నె కెక్కినారనుట నిశ్చయము. వీరిలో శ్రీ పానుగంటివారి రచనలపై విమర్శనగ్రంథమును తయారుచేసి డాక్టరుడిగ్రీ కూడ సంపాదించుట జరిగినదన్న శ్రీ పానుగంటివారిరచనలకుఁగల ప్రత్యేకత యెట్టిదో, పానుగంటివారి కట్టిరచనలు సాగించుటకు సర్వవిధములయిన యవకాశములు కలిగించిన శ్రీసూర్యారాయప్రభువర్యుల యౌదార్యము నట్టిదే. అట్టిరత్నత్రయమును వారికిఁ గూర్చిపెట్టిన మంత్రివర్యులపర్యవేక్షణ పాటవము నట్టిదే.

## శ్రీసూర్యారాయప్రభువర్యుల ఆంధ్రభాషాసేవ

ఆంధ్రభాషలో సుప్రసిద్ధులైన వారిమనసునకు నచ్చిన కొందఱు తెలుఁగుకవులరచనలు శ్రీమహారాజావారికి కంఠస్థ

ములై యుండెడివి. అట్టివి తిక్కనభారతములోని కొన్నియా శ్వాసములు, ఆముక్తమాల్యదలోని అన్ని యాశ్వాసములు, పింగళి సూరనకృతులలో కొన్ని భాగములును. వారేదేని తెలుఁగురచన సాగింపవలసివచ్చినపుడు, శబ్దముల సాధుత్వా సాధుత్వములనుగూర్చి తిక్కనాదుల ప్రయోగములను జ్ఞప్తికి తెచ్చుకొని నిర్ణయము చేయుచుండెడివారు. మహారాజా వారి సొంతలైబ్రెరీలో వారు చదివివిడువని ప్రబంధము లేవియు నుండెడివిగావు, ఆయాకవులరచనలలోని తరతమభావము వారిబుద్ధిలో సుస్థిరమై యుండెడిది. పింగళి సూరనకవిత్వ ముపై వారి కమితమైన యాదరము. శ్రీ పురాణపండ మల్ల య్యశాస్త్రిగారిచే ప్రభావతీప్రద్యుమ్నమునకు టీకాతాత్పర్య ములు రచింపఁజేసి సొంతముగ ప్రకటించియున్నారు. శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారిచే రెండుమాఱులు తమ సొంతఖర్చులతో కళాపూర్ణోదయము నచ్చు వేయించినవారు శ్రీమహారాజావారు. ఇంకొకమాఱు మల్లాది సూర్యనారా యణశాస్త్రిగారు లఘుటీకను జేర్చి కళాపూర్ణోదయమును ప్రకటింపఁగా దాని కయిన వ్యయమును శ్రీమహారాజావారే భరించి యచ్చొత్తించిపెట్టినారు. మరల నింకొకమాఱు బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారి సంపాదకత్వమున లఘుటీకతో పాటు సొంతముగ నచ్చొత్తించియున్నారు. కళా పూర్ణోదయప్రబంధముపై మహారాజావారికిఁ గల యభిమా

సమే దాని సన్నిభాగములు వెలువరింపఁజేయుటకు ప్రోత్సహించినది. వారియౌదార్యముతో వెలువడిన తెలుఁగు గ్రంథములు లెక్కకుమిక్కిలి యైనవి.

## సర్వజ్ఞసింగభూపాలునిపై గౌరవము

శ్రీమహారాజావారికి రావువంశముక్తామణియైన సర్వజ్ఞసింగభూపాలునియెడలఁ గల గౌరవ మపారము. వెలుగోటివంశపు వేంకటగిరిప్రభువులు వెలుగోటివంశచరిత్రమును తెలుఁగులోను, సింగభూపాలవిరచితమైన రసార్ణవసుధాకరమును సంస్కృతభాషలోను ప్రకటించియున్నారు. వీరు రావువంశముక్తావళిని పద్యరూపమున వెలయించినారు. సింగభూపాలవిరచితమైన 'రత్నపాంచాలిక' యను నాటికను ముందుగ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారిచే ననువదింపఁజేసిరి. మరల శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుపండితుల సంస్కారముతో శ్రీ గిడుగు సీతాపతిగారిచేత ననువదింపఁజేసి రెండుభాగములు మూలముతో సహా ముద్రింపఁజేసినారు. ఆ గ్రంథమునకు విపులమయిన పీఠిక వ్రాయుచు శ్రీమహారాజావారు, సర్వజ్ఞసింగభూపాలుఁడు పోతనభాగవతమును పాతిపెట్టించినాఁడను నపవాదము నిర్హేతుకమని నిరూపించియున్నారు. ఈవిషయనిరూపణము జరుగుచుండిననాఁటికి నేను శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణకార్యమునఁ బని చేయుచు, శ్రీనాథుఁడు శారదాంబను స్తుతిచేయుచు దర్శిం

చీన సర్వజ్ఞసింగభూపాలుఁడు రసార్ణవసుధాకరకర్తయే యనియు, భోగినీదండకములోఁ గనఁబడు సర్వజ్ఞసింగభూపాలుఁ డాతనిమనుమఁ డనియు, శ్రీనాథపోతనలు సమకాలికులు కారనియు, వ్యాసములు వ్రాయుచుండిన సమయము. కనుక కళాపూర్ణోదయప్రకటనము రత్నపాంచాలికానువాద ముద్రణములు వీనినిగూర్చిన గాథలు నాకుఁ బరిచితములు గనుక నింతవఱకుఁ దెలిపియుంటిని.

మఱికొంత కాలమునకు సింగభూపాలవిరచితమైన రసార్ణవసుధాకరమును శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిచే నను వదింపఁజేసి సంస్కృతమూలాంధ్రానువాదములతో నాగ్రంథమును శ్రీమహారాజావారే ప్రకటించియున్నారు. ఆంధ్ర భాషాపోషణమునకు వారు భోజులు కావున రావు సర్వజ్ఞసింగ భూపాలుని రచనలను చేతఁబట్టి ఆంధ్రానువాదములతో వానిని ప్రకటించి, రావువంశసంజాతులయిన సమకాలికప్రభువులెవ్వరు చూపింపని కృతజ్ఞతను సర్వజ్ఞసింగభూపాలుని యెడలఁ బ్రదర్శించినవారు శ్రీసూర్యరాయప్రభువర్యులు.

సర్వజ్ఞసింగభూపాలుని విజ్ఞానము గీర్వాణభాషలో ప్రామాణికమై సర్వతోముఖ మైనట్టులే, శ్రీసూర్యరాయ ప్రభువర్యుల ఆంధ్రసారస్వతపరిజ్ఞానమును ప్రామాణికము సర్వతోముఖమునై యుండెడిది. ఉభయులు విద్వత్కవుల నాదరించి విద్యాభివృద్ధికి సాటిలేనిసేవ చేసినవారే. సంస్కృత

భాషకు ప్రామాణికనిఘంటువయిన అమరకోశమునకు బొమ్మ కంటి అప్పయార్యుఁడు రచించిన అమరపదపారిజాతమునకు పరిశోధకులు సర్వజ్ఞసింగభూపాలవరేణ్యులు. ఆ ప్రేరణమే యగునేమో, శ్రీసూర్యరాయప్రభువర్యు లాంధ్రభాషకు సమగ్రము ప్రామాణికము అగు నిఘంటునిర్మాణమునకు మూల స్తంభమై నిలిచి, ఆ నిఘంటునిర్మాణకార్యమును నిర్వహించుట.

## ఆంధ్రసాహిత్యపరిషత్తునకు సర్వస్వము శ్రీసూర్యరావుప్రభువర్యులు

ఆంధ్రదేశమునందు గ్రాంథికభాషాసముద్ధరణమునకై బయలుదేరిన సంస్థలలో 55 ఏండ్లు నిలిచిన సంస్థ ఆంధ్ర సాహిత్యపరిషత్తొక్కటియే. కాలప్రవాహములో గాలివాన లెన్ని విసిరి సుడిగుండము లెన్ని రేగినను చెదరకుండ నిలిచి యున్నసంస్థ యిదియొక్కటియే. ఈసంస్థ చేఁబట్టిన మహత్తర కృత్యములలో మొదటిది గ్రాంథికాంధ్రభాషకు ప్రామాణికము సమగ్రము అగు నిఘంటువును నిర్మించుట. అట్టినిఘంటువు శ్రీసూర్యరాయప్రభువర్యులపేరితో వెలువడుటకు, వారికీర్తి ఆచంద్రార్కముగా నిలుచుటకు- ఈపని చేయఁదల పెట్టిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి ప్రేరణము, శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడుగారి యనుమోదము, శ్రీ పిఠాపురము మహారాజావారి మహౌదార్యపురస్కృతమయిన అం

గీకారము, వారి అచంచలమయిన దీక్షయు ప్రధానకారణము లయినవి. 1911 లో ఆంధ్రసాహిత్యపరిషత్తును మదరాసులో స్థాపింపఁ దలపెట్టిననాఁడు, ఈప్రసంగము వచ్చినప్పుడు శ్రీమహారాజావారిపక్షమున వారియంగీకారమును దెలిపిన వారు, తనూల్మమున శ్రీసూర్యరాయప్రభువర్యుల కీర్తిని ఆంధ్రభాష నిలిచియున్నంతవఱకు చెదరకుండ నుండునట్లు చేయుటకు మార్గదర్శకు లయినవారు శ్రీ మొక్కపాటి సుబ్బారాయుఁడుగారు. శ్రీమహారాజావారి విద్యాపోషణాభిరతి, ఆడినమాట తప్పని త్యాగనిరతి వారి కిట్టిశాశ్వతకీర్తి సంపాదక మయినది.

ఆంధ్రసాహిత్యపరిషత్సంస్థాపకులు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు నాఁడు ప్రభుత్వోద్యోగములో నున్నత పదవి నిర్వహించుచు, శాసనపరిశోధనము గావించుచు ఆంధ్రభాషాభివృద్ధికై యాంధ్రసాహిత్యపరిషత్సంస్థను నెలకొల్పవలెనను పూనికతో కార్యరంగమునం దడుగుపెట్టి, పిఠాపురము వెంకటగిరి బొబ్బిలి సంస్థానాధిపతుల వంటి వారును జమీందారులను ఆ సంస్థకు పోషకులనుగా జేర్చి, వారిచ్చిన విరాళములను మూలధనముగాఁ జేసి ఆసంస్థ కమూల్యమయిన వికాసమును దీసికొనివచ్చిరి. పరిషదభివృద్ధికై శ్రీసూర్యరాయప్రభువర్యులత్యాగము లెక్కకుమిక్కిలి యైనది. ఆ పరిషత్పక్షమున వెలువడిన శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణ

మునకైన ధనమంతయు శ్రీపిఠాపురమహారాజావారు వెచ్చించినదియే. నాలుగవసంపుటము తుదివఱకు అచ్చుపని పూర్తియై, తరువాతిసంపుటము వ్రాఁతపనికూడ నాలుగక్షరములపని కొంచెముగా పూర్తియై, కాకినాడలో నిఘంటుకార్యాలయము మూఁతపడునప్పటికి ఆ ప్రభువర్యులు వెచ్చించిన సొమ్ముమొత్తము మూఁడులక్షలరూప్యములు. ఇంతధనము వెచ్చించి పరిషత్పక్షమున నిఘంటునిర్మాణదీక్ష వహించిన మహోదారులు శ్రీ సూర్యారాయప్రభువర్యులే కావున, వారాంధ్రసాహిత్యపరిషత్తునకు యావజ్జీవాధ్యక్షులై యుండి, పరిషదభ్యుదయమునకై తమసర్వస్వము వెచ్చించి శాశ్వతకీర్తి నార్జించుకొనినారు.

## పిఠాపురమహారాజావారి తుదియాకాంక్ష

ఈ నిఘంటునిర్మాణకార్యము మొదట మదరాసులో శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారిపర్యవేక్షణమున ప్రారంభమయినది. అచట పనిజరుగుటలో ఆలస్య మేర్పడుటచే నిఘంటుకార్యాలయము పిఠాపురమునకు పరిషత్కార్యాలయము కాకినాడకు తీసికొనిరాఁబడినవి. అప్పటినుండి పని కొంత చురుకుగా జరిగి, 1944 తుదికి 'అ' మొదలు 'న' తుదివఱకు నాలుగుసంపుటములు ముద్రితము లయినవి. ఆతరువాత, వ్రాఁతపని పూర్తియైనపిమ్మట మరల అచ్చుపని ప్రారంభింపవచ్చునని, అనఁగా 'ప' మొదలు 'వ' చివరివఱకు ఇప్పుడచ్చు

పని పూర్తియై వెలుఁగులోనికి వచ్చినతరువాతి రెండున్నర సంపుటములకు సంబంధించిన వ్రాఁతపని 1949 నాటికి కాకినాడలో పూర్తియైనది. తుదిసంవత్సరములో శ్రీ గిడుగు సీతాపతిగారు శ్రీమహారాజావారి యనుమతితో నిఘంటు కార్యాలయములోని సామగ్రినంతను మదరాసునకు తీసికొనివెళ్లి, సుమారు 10 యేండ్లతరువాత అచ్చుపడిన కాగితములను, కొఱవడియున్న నిఘంటుకార్డులను ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున కందఁజేయుట జరిగినది. 1962 లో మిగిలియున్న 'శషసహ' అను నాలుగక్షరములనిఘంటుభాగమును పూర్తి చేసి, మహారాజావారు సజీవులై యుండఁగ 'మీనిఘంటువు పూర్తియైన' దనుమాట వారికి వినిపింపవలెనని, అంతకుముందు నిఘంటుకార్యాలయములో పనిచేసిన పండితులము కాకినాడవాస్తవ్యులము నలుగురము, నాలుగుమాసములు పనిచేసితిమి. దానిని పూర్తిచేయు అదృష్టము మాకును, మహారాజావారు సజీవులైయుండఁగా పూర్తియైన దనిపించుకొను అదృష్టము నిఘంటువునకును లేమిచే, ఆపని అంతటితో ఆగిపోయినది.

తరువాత ఆపని పూర్తియగుటకు యత్నము హైదరాబాదులో జరుగుచున్నట్లు, జరిగినట్లు జనశ్రుతి గలదు. ఏ నాఁటికైన నేదోరూపమున ఆ నిఘంటుస్వరూపము బయటఁబడిన అది భాషకు మహోపకారము జరిగినట్లే. ఆనాఁడు శ్రీ

సూర్యరాయప్రభువర్యులయాత్మ కమితమయిన శాంతి యేర్ప డఁగల దనుట నిశ్చయము. 'నేను బ్రతికియుండఁగ నీ నిఘం టువు పూర్తి యగుట చూచెదనా ?' అని తమకంటె వృద్ధులు శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులు నగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారితో మహారాజావారు వెలిబుచ్చిన ఆర్తి అట్లేయుండిపోయినది. ఈనాఁడు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రామాణ్యమును తెలిసికొనుచు, ఆంధ్రభాషా విషయక పరిశోధనములు గావించువారందఱు, ఆ కొదువభాగ మెప్పటికయిన లభించునా ? యని వేయికన్నులతో నెదురు చూచుచున్నారు. ఇవి పూర్తికాకుండిసందులకు వారివారి యంతరాత్మ లెంతక్షోభించుచున్నవో యెవ్వరు గుర్తింపఁ గలరు ?

ఇంచుమించుగ 20 సంవత్సరములనుండి ఆంధ్రసారస్వతములో నేవిషయముమీఁద క్రొత్త గ్రంథములు వ్రాయఁదలఁచినవా రుండిన, వారు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు చూడకుండఁ గాని, దానివలన సహకారము నందకుండఁ గాని యుండుట కనఁబడదు. ఇది సమగ్రమై, ఈనడుమకాలములో ఆ నిఘంటు ముద్రణాదులందు దొరలిన వ్యత్యాసములు, ఇంతకుముం దా నిఘంటు నిర్మాణములో విశేషముగాఁ బాల్గొని అనుభవము గణించియున్న పండితులసహకారముతో సవరింపఁబడి, మొదటిరూపములో తుదినఱకు నిర్వహింపఁబడిననాఁడు,

ఆంధ్రభాషకు భావితరములకుఁ జాలినంత మహోపకారము జరిగి, శ్రీసూర్యరాయప్రభువర్యుల కీర్తి శాశ్వతమై, వారి యాత్మకు శాశ్వతమైన శాంతి లభింపఁగలదు. ఈపని శ్రీపిఠాపురముమహారాజావారియెడల సానుభూతి గలవారందఱకు నవశ్యకర్తవ్యమని నా మనవి. ఈనావ్రాఁత శ్రీ మహారాజావారినిగూర్చి, శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మితినిగూర్చి తెలిసినవిషయమునకు సూచనమాత్రమనికూడ మనవిచేసి కొనుచున్నాను.

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.



శ్రీపతిప్రెస్, కాకినాడ—1966.